Registered No. M-4345

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ నవంబరు నెల 28 వ తేది శుక్రవారం [నె 37 రు

## యుద్ధ సామానులు, ఇండియా.

### ఇతర దేశాలకంటె ఎక్కువగా పంపుచున్నది ఇండియా.

### తూర్పుదేశాల అక్కర ఇండియా తీర్చుచున్నది.

ఈ యుద్ధం ప్రారంభమయిన తరువాత బ్రిటిషు ప్రభుత్వం వారు తమ పరిపాలన క్రిందనున్నవియు, మిత్రవర్గమునందున్నవియగు తూర్పుదేశాలన్నింటికి సరకు సప్లై చేయుటకు తూర్పు దేశాల ప్రతినిధుల సభయొకటి డిల్లీలో సమావేశపరచియుండిరి. ఈ సభవారు ఏదేశంనుండి యేయే సామానులు తయారు చేయించి యుద్ధరంగాలకు పంపగలమాయని యోచించి నిర్ణయించి ఆర్డరులను పంపుచుందురు. ఈ యేర్పాటు ప్రకారం ఇండియానుండియే యుద్ధావసరములకు ఎక్కువ సామానులు యుద్ధానికి పోవుచున్నవి. ఇతర తూర్పు దేశాలకన్న ఇండియావే యెక్కువ లాభం పొందుచున్నది. అటు ఆఫ్రికా ప్రాంతములకు ఇటు జపాను ప్రాంతములకు ఇండియా మధ్యగనుండుటచే ఈ సరకు రవానాకు మంచి సదుపాయంగా అందుబడిగానుంది.

యూరోపు యుద్ధరంగాలకు ఇంగ్లాండునుండిగాని, అమెరికానుండికాని సరకు రావాలంటే చాల ఆలస్యమవుతుంది. వాటిని రవానాచేయు స్టీమరులుకూడ ఎక్కువ కావాలి. ప్రయాణం కష్టంగానే యుండును. ఈ యిబ్బందులన్ని లేకుండా వీలయినంతవరకు సైన్యాలకు కావలసిన సరకులు అన్నిరకములు ఇండియాలో దొరకునంతవరకు సేకరించి పంపించుటకును, ఇండియాలో క్రొత్తరకాల తయారు ప్రోత్సాహించుటకును తగిన యేర్పాటులన్నియు జరుగుచున్నవి. యుద్ధం జయప్రదంగా కొనసాగుటకు యేయే వస్తువులు కావాలో, అందులో యింతవరకు ఇండియాలో తయారుకాకుండా వున్నవాటి నమూనాలు ముఖ్యమగు పరిశ్రమలుగల స్థలములలో ప్రదర్శించి యుంచబడుచున్నవి. వాటిని చూచి ఉత్పత్తిదారులు అట్టివి తయారుచేయ ప్రయత్నించి ఆ లోపము తీర్చెదరని ఆశింపబడుచున్నది.

ఇతర విధములగు పరిశ్రమలు ఇండియాలో ఎన్నో అభివృద్ధి చెందినాయి. కాని యిప్పటికీ ఎలక్ట్రికు పరికరాలు, ఉన్ని వస్త్రాలు, డబ్బాలలో నిలవయుంచబడు ఆహార పదార్థములు ఇండియాలో తయారు చేయబడలేదు. ఇవి యితర తూర్పు దేశాలలోనే తయారు చేయబడుచున్నవి.

### ముందుగానే తయారు చేయిస్తున్నారు.

వివిధదేశాలకు యేయే వస్తువులు కావాలో ముందుగానే తెలిసికొని తూర్పుదేశాల సంఘంవారు వాటిని తయారు చేయవలసినదిగా పరిశ్రమలకు ఆర్డరులు పంపుచున్నారు. ఉదహరణకు : 1942 వ సం॥ అక్టోబరు ఆఖరువరకు కావలసిన జనుమునార వస్తువులకు ఇండియాలో యిపుడే ఆర్డరుచేసిరి. ఇపుడు ఇండియాలోనున్న పరిశ్రమలు కర్మాగారములందున్న యంత్రాలను ఎక్కువ చేసుకొని పనివారినెక్కువ కష్టపెట్టకుండానే కావలసిన వస్తువులన్ని సకాలంలో తయారుచేయించుటకు వీలగునట్లుగానే ముందుగా ఎంతసరకు కావాలో నిర్ణయించి ఆర్డరులు యిస్తున్నారు.

ఈ వ్యవహారం అంతా నిర్వహించేది ఇండియా ప్రభుత్వ సప్లయి డిపార్టుమెంటు. తూర్పు దేశాలసంఘంలో ఇండియా ప్రతినిధిగానున్న ఎం. ఎస్. ఎ. హైదరీగారు యీ సప్లయి శాఖతో తరుచు సంప్రదించుచు ఇండియాలో యుద్ధ సామగ్రి తయారుచేయుచున్న కర్మాగారములను స్వయంగా పోయి చూచుచు, వాటి సమర్థత తెలిసికొనుచున్నారు. ఈ తూర్పు దేశాల సంఘం స్థాపింపబడి వచ్చే ఫిబ్రవరికి ఏడాది పూర్తియగును. హైదరీగారు తాము పోయినచోట్ల వర్తక వాణిజ్యసంఘముల ప్రతినిధులను చూచి, వారికిగల సందేహములను తొలగించుచున్నారు.

### ఆయుధ సామగ్రి ఉత్పత్తి.

ఇండియాలో ఆయుధసామగ్రి ఉత్పత్తి చాల ఎక్కువ చేయబడుచున్నది. క్రొత్త ఫాక్టరీలు కట్టే యేర్పాటులు సంతృప్తికరంగా కొనసాగుచున్నవి. ఒక ఉక్కు లోహపు కర్మాగారమునందు ఆ క్రొత్తరకం ఆయుధాలు తయారు చేయించుటకు తగు ఏర్పాటులు చేయబడినవి. అది నెల రోజులలోగా పని ప్రారంభించగలదు. అందు విమానాలుప యోగించే బాంబులు తయారుచేయబడును. ఇనుము పను లేగాక, యితర సామానులుగూడ తయారుచేయించు క్రొత్త యేర్పాటుగూడ అదే ఫాక్టరీయందు జరుగుతున్నది.

పెద్ద ప్రేలుడు వస్తువులను, తుపాకులు, గుండ్లను తయారు చేయు ఫాక్టరీ ఒకటి కొద్దివారాల క్రిందట కట్టబడినది. ప్రేలుడు వస్తువుల కవసరమగు గంధకం రసాయన ద్రవ్యములు తయారుచేయుటకును బాంబులకు రంజికాలు, తుపాకులకు తోటాలు తయారు చేయించుటకును అవసరమగు యంత్ర సామగ్రి ఆ ఫాక్టరీలో చేకూర్చబడింది.

తూర్పు దేశాల సంఘంవారు కోరినటువంటి తుపాకులు, ఫిరంగులు, సున్నీలు, ఫిరంగులుంచు ముక్కాలు పీటాలు, మున్నగునవన్ని త్వరగ తయారగుచున్నవి.

ఇండియా రక్షణకు, తూర్పు దేశాల రక్షణకు అవసరమగు ఇంజనీరింగు పనులు అతివడిగా జరుగుతున్నాయి. మందుగనులువేయు నౌకలు, ట్రాలరు నౌకలు, దూరప్రయాణంచేయు నౌకలు తయారుచేయుపని ప్రారంభమయింది.

### గాలి గుమ్మటాలు.

విమానాలనుండి జారి దిగుటకు వీలగు పారషూట్సు (గాలి గుమ్మటాలు) తయారుచేయుట అతివడిగా జరుగుచున్నది. అందుకు కావలసిన పట్టుబట్టఅంతా తయారుచేయబడుచున్నది. విషవాయు కవచాలకుగూడ కొంత వస్త్రం కావలసియున్నది. ముందుగా యీ వస్త్రం తయారు చేయించుట అనేక కంపెనీలద్వారా జరుగుచున్నది. తరువాత ఆ వస్త్రం కవచ రూపంగా కుట్టించి విషవాయువును మంచి వాయువుగా మార్చే సామగ్రి అతికించుపని వేరే కంపెనీలలో జరుగును. క్రొత్త రకాల ఆహార పదార్థాలుకూడా ఇపుడు ఇండియాలో ఎక్కువగా తయారవుతున్నాయి. కలప సామగ్రికూడ

ఎక్కువ కావలసియున్నది. ఇండియానుండి తూర్పు దేశాల సంఘంవారు యింతవరకు రూ $4\frac{1}{2}$ కోట్ల విలువగల కలప సామగ్రి డేరాలు వేయుటకు, యితరపనులకు కొనియున్నారు. గత పక్షంలో ఇండియానుండి 40 రకాల వస్త్ర సామగ్రియు, ఇంజనీరింగు స్టోర్సు అనేకరకములు, సూదులనుండి గర్డరులవరకు విశేషంగా తూర్పు దేశాల సంఘంవారు కొన్నారు. ఈ యుద్ధంవలన ఇండియాలో పరిశ్రమలన్నింటికి యీ రీతిగా గిరాకి చాలహెచ్చింది.

# లిబియా యుద్ధం.

## బ్రిటిషువారి దాడి వడిగా కొనసాగుతున్నది.

## ఇరానులో క్రొత్త రైలుమార్గం: ఈజిప్టులో సైన్య సమీకరణం:

## అమెరికానుండి నెలకు 30 స్టీమరుల సరకు దిగుమతి.

ఆఫ్రికా ఉత్తర సముద్రతీరమునందున్న లిబియాలో బ్రిటిషు సైన్యాలదాడి యిపుడు జయప్రదంగా కొనసాగుతున్నది. ఈ దేశం ఇటలీ సామ్రాజ్యానికి చెందినది. ఈ యుద్ధం ప్రారంభమైనాక ఈ దేశం ఉత్తరభాగమునందు తీవ్ర యుద్ధం జరుగుటకు యిది నాల్గోసారి. ఈజిప్టు యీ లిబియాకు తూర్పుననున్నది. ఈజిప్టునుండి వచ్చి లిబియాపై దాడిచేయుచున్న బ్రిటిషు సామ్రాజ్య సేనలలో భారతీయ సేనలు చాల అద్భుతంగా పని చేయుచున్నవి. ఇవి శత్రువునకు అతి చేరువగపోయి వారి ఆయుధబలం నాశనం చేయుచున్నవి. భారతీయసేనలలో మదరాసు సైన్యంకూడా గలదు. ఈ నేల సైన్యాలకు సముద్రతీరమునందున్న బ్రిటిషు నౌకాదళం పైనుండి విమానదళంకూడ ఎక్కువగ తోడ్పడుచున్నవి. లిబియా యుద్ధం మంచి యుక్తికిని తీవ్రతకును పేర్వడిన మహా యుద్ధంగా చరిత్రలో పేర్కొనబడగలదు.

నాల్గు నెలలనుండి యీప్రాంతమునందు యుద్ధ పరికరాలు చేకూర్చి యుంచబడుచున్నవి. లిబియా ఉత్తర సముద్ర తీరభాగమును బెంఘాజి రేవు వరకును నిరుడు బ్రిటిషు సైన్యాలు ఆక్రమించుకొనియుండెను. తరువాత జర్మను సేనలు వచ్చి కొంత ప్రాంతమును బ్రిటిషువారివద్దనుండి తిరిగి వశపరచుకున్నవి. అపుడు టొబ్రుకు రేవు పట్నమునుమాత్రం బ్రిటిషు సేనలు విడువలేదు. అందున్న బ్రిటిషు ఇండియను సేన నేటికి 230 దినములుగా శత్రువుల ముట్టడిని ఎదిరించి నిలుచుటయేగాక, యిటీవల బయటనున్న శత్రు సేనలపై తిరుగు దాడి సలిపిగూడ ఓడించెను. ఈ టొబ్రుకు రేవునుండి తూర్పున ఈజిప్టు, పాలస్తీనా, సిరియా, ఇరాకు, ఇరాను దేశములగుండాపోయి కొంచెం ఉత్తరంవైపు మరలితే రష్యా దక్షిణమున కాకసను ప్రాంతమువరకుయున్న 6000 మైళ్ల ప్రదేశమూ యుద్ధరంగంగానే ఎంచవచ్చును. ఈ విశాల ప్రదేశమునందు వివిధ దేశములు వేరువేరు విధములుగనున్నవి. కొన్ని మిట్టలు, గుట్టలు, కొండలతోను, కొన్ని ఎడారులతోను, కొన్ని మహా నదులతోను, కొన్ని మంచి సాగుబడిగల పొలములతోను నిండియున్నవి. కావున యీ ప్రదేశమునందు సేనలు విజయం పొందాలంటే అతి వడిగా దాడి సాగించవలసియుండును. ఈ దేశాలన్నింటిలో దేనికవి రైళ్లు రోడ్లు రాధారులు కలిగియున్నవి కాని, ఒక దేశం మార్గాలు యింకోదేశంతో కలసి లేవు. ఇపుడు యుద్ధం వచ్చినాక అవసరంవచ్చి యీదేశాల రాధారులను కలుపునట్టి బాధ్యత మిత్రమండలి అధికారులు వహించిరి. సరకు సప్లైచేయడం, పనివారిని జతకూర్చడం, సులభమగు రవానా మార్గాలు ఏర్పాటుచేయడం అతి వడిగా జరుగుచున్నది. బ్రిటిషువారి కృషివలన, అమెరికా సహాయంవల్ల యీపని కొనసాగుతున్నది.

### నెలకు 30 అమెరికా స్టీమరులు.

ఇరానుగుండా రష్యాకు యుద్ధ సామగ్రి పోవుటకై రైలు మార్గమును క్రొత్తగవేసిరి. ఇరాను దక్షిణమున పర్షియా రేవు స్థలములందు అనుదినం 2,000 టన్నుల యుద్ధ సామగ్రి దింపుటకు తగు వసతులను ఇండియను ఇంజనీరింగు కంపెనీలు ఏర్పాటు చేయుచున్నవి. ఆ సరకు రైలుమార్గాన గొంపోవుటకు ఇంగ్లాండు కర్మాగారాలలో 10 వారాలలో 1000 గుడ్సు పెట్టెలు, 142 ఇంజనులు తయారు చేయబడినవి. అమెరికా, ఇండియా, ఆస్ట్రేలియాలనుండికూడ రైలు పెట్టెలు పంపబడినవి. అమెరికానుండి వచ్చు విమానాల భాగాలను జతచేసి కూర్చి విమానాలను నెలకు 300 కూర్చునట్టి కర్మాగారమొకటి బస్రాలో కట్టబడుచున్నవి. సూయజు రేవులో నెలకు 30 చొప్పున సామాను స్టీమరులు అమెరికానుండివచ్చి దిగుచున్నవి. వాటిలో బరువైన టాంకు మోటారులు, రైలు పెట్టెలు, విమానాల భాగాలు వస్తున్నవి. ఇండియాలోని బెలూచిస్తానంనుండి ఇరాను వరకు మధ్యనున్న రాధారులు నగరాలు రేవులన్ని యిపుడు చాల సందడిగ పనులతో కలకలలాడుచున్నవి.

### విమాన మార్గాలు.

ఈజిప్టు ముఖ్యనగరము కైరోనుండి ఇరాకులోని బాగ్దాదుమీదుగా ఇరానులో ముఖ్యపట్నమగు టెహరానువరకు విమానాల సర్వీసును బ్రిటిషువారు యేర్పాటు చేసిరి. ఇందువలన అదివరకు ఆరు రోజుల రోడు ప్రయాణం యిపుడు ఏడుగంటలలో జరుగుచున్నది. ఆ రోడ్లుగూడ ఎడారుల మధ్యనుండుటచే ప్రయాణం చాల కష్టంగానుండును.

### క్రొత్తసైన్యం, క్రొత్త ఆయుధాలు.

లిబియాయందున్న పడమటి ఎడారియందు ఎనిమిదవ క్రొత్త సైన్యం తయారు చేయబడినదని పక్షం దినముల క్రిందట బ్రిటిషు అధికారులు ప్రకటించిరి. ఇంత పెద్ద సైన్యానికి క్రొత్త రకాల ఆయుధాలు, యుద్ధ సామగ్రి అంతా చేకూర్చబడింది. ఈ సామాను అమెరికానుండి వచ్చింది. జర్మనీతో సరిసమానమగు క్రొత్తరకం ఆయుధాలతో జరుగుచున్న ప్రథమ యుద్ధం యీ లిబియా యుద్ధమేనని చర్చిల్ ప్రధాని చెప్పియుండెను. లిబియాలోని బ్రిటిషు సైన్యానికి సూయజుకాల్వ మార్గాన యీ క్రొత్త సామగ్రి అంతా చేరింది. కాని జర్మనీ-ఇటలీ సైన్యాలకు సామానుతెచ్చే 175 నౌకలను బ్రిటిషు నౌకాదళంవారు ఆగస్టునుండి యీ నాల్గు నెలలలో ముంచివేసిరి. ఇటలీ యుద్ధ నౌకలుగూడ విశేషంగా నాశనం చేయబడినవి. బ్రిటిషు విమానదళం కూడ లిబియాలోని శత్రు సేనలకు సప్లైలు అందకుండా బాంబులువేసి సామాను మోటారులను, స్టీమరులను నాశనం చేయుచున్నవి.

### యుద్ధ క్రమం.

ఈ యేడు ప్రారంభంలో బ్రిటిషు సేనానాయకుడగు జనరలు వావెలుగారు తమ సేనలతో లిబియా ఉత్తర భాగమగు సిరనైకాను ఆక్రమించి ఇటలీ సేనాలను వోడించిన పిమ్మట మధ్యధరాసముద్రం ఉత్తరతీరమున ఉన్న గ్రీసు దేశానికి సహాయంగా కొంతసేనను పంపవలసివచ్చెను. ఆ సమయంలో జర్మను సేనానాయకుడగు జనరలు రోమెలు బ్రిటిషు సైన్యాలను లిబియాలోని బెంగాజినుండి ఈజిప్టులోని

సోలుంవరకు తరిమివేయ గలిగెను. శత్రు సేనలు ఈజిప్టు సరిహద్దుల వద్దనే నిలిపివేయబడినవి. ఇప్పుడచట బ్రిటిషు నేలసేనకు నాయకుడైన సర్ అలను కనింగు హాంగారు అబిసీనియాలో ఇటలీ సేనను ఓడించి తిరిగి చక్రవర్తికి ఆ దేశాన్ని ప్రసాదించిన నిపుణుడు. అతని సోదరుడు అడ్మిరలు సర్ అండ్రు కనింగుహాముగారు అచటి బ్రిటిషు నౌకాదళం అధిపతి. వీరుభయులును విమానదళనాయకుడగు యింగో కనింగుహాముగారితో మంచికలిసి కట్టుగా పనిచేయుచూ, యీ లిబియాదాడిని ప్రారంభించిరి. జర్మను సేనానియగు రోమెలును అతని సైన్యాన్ని ఓడించి, వారి టాంకు లన్నింటిని ధ్వంసం చేయాలని సంకల్పించిరి.

### మూడు రోజులలో 100 మైళ్లు.

మొదటి ఐదు రోజుల దాడిలోనే బ్రిటిషు సేనలు చాల అద్భుతమగు విజయమును పొందినవి. ఉత్తరమున జర్మను సేనలు నిలకడగ శిబిరము లేర్పరచుకొనియుండగా, దక్షిణము నుండి అకస్మాత్తుగా బ్రిటిషుసేన వారిపైబడి, విస్మయంగొల్పి ఓడించెను. భారతీయ సేనలు సిడిఓ మారునువో అను పట్నమును వశపరచుకొన్నవి. సిడిరాజెగు, కాపుజోకోట, బార్డియా నగరం, గాంబూటు పట్నములను యితర బ్రిటిషు సేనలాక్రమించినవి. మూడు రోజులలో నూరు మైళ్లు ఆక్రమించిరి. మొదటి మూడు, నాల్గు రోజులలోనే జర్మను టాంకులు సగం నాశనమైనవి. టొబ్రుకు, ఎల్‌గోబి, సోలుం యీ మూడు నగరాల మధ్యనున్న ప్రదేశమునందు జర్మను సేన చుట్టివేయబడింది. ఈవలయాన్ని భేదించి బయటకు పోవడానికి జర్మను సేనలు చాల తీవ్రంగా పోరాడుచున్నవి. వారి టాంకులన్నింటిని నాశనంచేయడానికే ముఖ్యంగా బ్రిటిషు సేనలు సంకల్పించినవి. దేశాక్రమణ వారికంత ప్రధానంకాదు. జర్మనులు తూర్పునుండి పడమరకు పోవాలని, మధ్య నడ్డంగానున్న బ్రిటిషు సేనను చీలదీయాలని ప్రయత్నిస్తున్నారు. కాని తీవ్రంగా నిరోధింపబడుచున్నారు. టొబ్రుకులోనున్న బ్రిటిషు సైన్యం బయటకువచ్చి శత్రువులు వేసిన మందుగుండులను దాటి ముందుకి సాగినది.

చుట్టివేయబడిన జర్మను సేనలు బ్రిటిషు సేనలతో పోరి జయించి బయటపడలేకుంటే, చావో, ఖైదో తప్పదు. సిడి ఒమారునందు ఇప్పటికి భారతీయ సైనికులు 8,000 శత్రు సైనికులను ఖైదీలుగా పట్టుకొనిరి. ఈసారి ఇటలీవారుగాక జర్మనీ సైనికులతో యుద్ధంచేయాలి కనుక బ్రిటిషు సైన్యాలకుగూడ కష్టం ఎక్కువగానే వుండును. జర్మనులు ఎంత మందిసేనా, ఎన్నియంత్రాలసేన ఒడ్డగలరు. అయితే బ్రిటిషు వారికిగూడ ఆధునిక యంత్రసామగ్రి జర్మనులతో సరిసమానమైనదికలదు. చర్చిల్ చెప్పినట్లు ఇది చాల ప్రధానమైన యుద్ధం. తగిన ఆయుధ సంపత్తి, నౌకాదళ, విమానదళ సహాయంకలదు. కావున బ్రిటిషు సైన్యాలు తమ ఉనికి సార్థకం చేసుకోగలవు.

---

# ఆఫ్రికాలో హిట్లరు యెత్తులు, బ్రిటిషువారి పైయెత్తులు.

## హిట్లరు—పెటేను సమావేశంయొక్క ఉద్దేశము.

[మధ్యధరాసముద్రమునకు దక్షిణమున నున్న ఆఫ్రికా ఖండంలోని ఉత్తరభాగంలో తూర్పున ఈజిప్టు-అబిసీనియాలు బ్రిటిషువారివశమున్నవి. బ్రిటిషు సైన్యాలు, నౌకాదళాల కేంద్రములు ఈజిప్టులోనే యున్నవి. దానికి పడమరగ లిబియారాష్ట్రము ఇటలీకి చెందియున్నది. దానికి పడమరగనున్న ట్యూనిసు, అల్జీరియా, మొరాకోలనే రాష్ట్రములు ఫ్రెంచివారివగు పడమర ఆఫ్రికాకు చెందియున్నవి. ఫ్రాంసు 1940 జూనులో జర్మనీకి లొంగిపోయినతరువాత, ఫ్రెంచివారి ఆఫ్రికా సామ్రాజ్యంలోని యీ భాగం ఆ లొంగిపోయిన విషీ (ఫ్రాంసు) ప్రభుత్వంక్రిందనే యున్నది. ఈ ఫ్రెంచి సామ్రాజ్యమునకు ఉత్తరమున మధ్యధరా సముద్రతీరమునందు ఓరాను, అల్జియర్సు, ట్యూనిసు అను ముఖ్య రేవుస్థలములు నౌకాశిబిరములును, జిబ్రాల్టరు జలసంధికి పడమరను, అట్లాంటికు సముద్రతీరమునందు కసబ్లాంకా, డేకరు రేవులందు నౌకాశిబిరములును గలవు. ఇవన్ని ప్రస్తుతం విషీ (ఫ్రాంసు) స్వాధీనమునందే యున్నవి.]

గతవారం లిబియాలో యుద్ధం ప్రారంభమైనపిదప విషీ వ్యవహారాలు వార్తలలో ఎక్కువ ప్రాముఖ్యతకు వస్తున్నాయి. లిబియాలో బ్రిటిషు సైన్యాలు విజయంపొందుతూ ఎక్కువ రేవుపట్నాలను ఆక్రమించుచూ వుండడంచేత హిట్లరు ఫ్రెంచివారి ఆఫ్రికా సామ్రాజ్యంలోని రేవుస్థలాలను వశపరచుకొనదలచియుండును, ఫ్రెంచివారి ఆఫ్రికా సేనానాయకుడు, సర్వాధికారియైన జనరలు వేగాంగారు యిందు కెంతమాత్రం అంగీకరించలేదు. కనుక హిట్లరు విషీ అధికారులతో మంతనాలాడి వేగాన్ను డిస్మిసు చేయించకలిగెను. ఇంక ఉత్తరతీరపు రాష్ట్రాలనుగూడ జర్మనీ వశపరచుకొంటే లిబియాలో బ్రిటిషుసైన్యాలచే దెబ్బతింటున్న తమ సేనలకు సామానుపంపుటకు వీలుగానుండునని హిట్లరు తలంచెను. ఆ రేవుస్థలాలు జర్మనీవశమైతే జిబ్రాల్టరునుండి పడమరకు తూర్పునకు పోవు బ్రిటిషు నౌకలను నిరోధించుటకు జర్మనీకి వీలుండును. ఉత్తర రేవుస్థలాలకును, పడమరను డేకరు మున్నగు అట్లాంటికు రేవుస్థలాలకును మోటారు రోడ్లు, రైలుమార్గాలు అపుడే వేస్తున్నారు. విశాలమగు యీదేశం రెండు సముద్రాల మధ్యభాగమంతా (అంటే ఫ్రెంచివారి ఉత్తర పశ్చిమ ఆఫ్రికా సామ్రాజ్యమంతా) జర్మనీ వశమందుంటే జర్మనీబలం యినుమడింపగలదని హిట్లరు తలంచెను. ఈవిషయం సెటలుచేసుకుందుకే విషీ ప్రభుత్వాధికారియైన మార్షలు పెటేనుగారిని చూచుటకు హిట్లరు స్వయంగా పోతున్నాడు.

కాని అన్నీ హిట్లరు అనుకున్నట్లు జరుగుతున్నాయా? రష్యాలో అతననుకున్నట్లు యుద్ధం త్వరగ ముగియలేదు. ఫ్రెంచివారి ఆఫ్రికాసామ్రాజ్యంలోనే లిబియాకు దక్షిణంగానున్న ఫ్రెంచి ఈక్వెటోరియలు ఆఫ్రికాఖండం విషీ అధికారాన్ని ధిక్కరించి, స్వతంత్ర ఫ్రెంచి సేనానియగు జనరలు డిగాలుగారి వశమైంది. అంటే బ్రిటిషువారి కనుకూలం. దానికి తూర్పున బ్రిటిషువారి ఈజిప్టియను సుడాను పడమరనున్న నైగారియాలను యీ ఫ్రెంచిరాష్ట్రం కలుపుచున్నది. కావున లిబియాలోని ఇటలీసేనల భయం ఈజిప్టు సుడానుల కుండదు. కాని లిబియా దక్షిణమున స్వతంత్ర ఫ్రెంచి సేనలు ఇటలీ జర్మనీసేనలకు ప్రక్కలో బల్లెమువలె నుండగలవు. అమెరికానుండి వచ్చు ఆయుధసామగ్రి యీ స్వతంత్ర ఫ్రెంచిరాజ్యం రేవులలోదిగి ఈజిప్టు, ఎర్రసముద్రం రేవులవరకు పంపబడగలదు. ఈవిధంగా అట్లాంటికు ఎర్ర సముద్రములకు సరాసరి రైలు, విమానమార్గములు స్వేచ్ఛగా నేర్పడినవి. బ్రిటిషువారు ఫ్రెంచి ఈక్వటోరియలు ఆఫ్రికాలో విశేషం ద్రవ్యం మదుపుపెట్టి, అచటి పంటలన్ని కొనుట కంగీకరించిరి. అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు డిగాలుగారి స్వతంత్ర ఫ్రెంచిప్రభుత్వము నంగీకరించి

అరువుకౌలుచట్టంప్రకారం సరకు సప్లయి చేయుటకుగూడ అంగీకరించెను. ఇది జర్మనీకి గొప్ప దెబ్బ.

అంతేగాక అమెరికా ప్రభుత్వం విషీ—జర్మని సహకారమును గూర్చి అనుమానించుచునే యున్నది. జర్మనీనుండి సైనిక, ఆర్థిక రాయబారవర్గములు ఫ్రెంచి-ఆఫ్రికాకు త్వరలో పోవుచున్నవని విని బ్రిటను-అమెరికాలు అందుకు తగు ప్రతికూల చర్యను తలపెట్టుచున్నవి. ఆఫ్రికా రేవు స్థలాలను జర్మనీ ఆక్రమించకముందే అమెరికా డేకరును వశపరచుకోవాలని అమెరికాలో అపుడే ఆందోళన బయలుదేరింది. జర్మనీ కుట్రలను బ్రిటను అమెరికాలు గుర్తించినవి. అట్లాంటికు రేవు స్థలాలకు డేకరు, కసబ్లాంకా మున్నగు నౌకాదళ కేంద్రములందు జర్మనులు నాలుగైదువేల జర్మను నిపుణులను ఉంచిరి. మొరోకోలో స్పెయిను దేశీయులను తిరుగుబాటు చేయమని ప్రోత్సాహించుచున్నారు. విషీతో సంధిచేసుకున్న తరువాత ఆ షరతులమలు జరిపే సంఘమను పేరిట మొరోకోలో ఒక సైన్యాన్నే జర్మనీ దింపేసింది. ఇవన్ని ఫ్రాంసుతో సమానఫాయిగానుండు సహకార చర్యలుగా పైకి చెపుతున్నా, ఫ్రాంసును అణచివేయడానికి హిట్లరు తలపెట్టిన ఎత్తులే. విషీలో పెతేను ప్రభుత్వం యీ ఒత్తిడికి లొంగిపోయేటట్లుగూడ సూచనలు గలవు. అందుకే బ్రిటను, అమెరికాలు డిగాలుగారితో కలసి ఎత్తుకి పై ఎత్తులు వేయుచున్నవి. లిబియాలో బ్రిటిషువారు దాడి ప్రారంభించింది కూడ, ఆఫ్రికాలో జర్మనీ-ఇటలీల ఆధిపత్యం నిర్మూలించడానికే. ఈదాడి రోజురోజుకు ఎక్కువ విజయవంతమగుచున్నది.

# “జర్మనీ గెలిస్తే……” అన్న సందేహం పడింది.

## యూరోపురాజ్యాల సభ తలపెట్టడం ఎందుకు?

డిసెంబరులోకాని, జనవరిలోకాని హిట్లరు యూరోపు రాజ్యాలన్నింటి ప్రతినిధుల సభ జరుపుతాడని, దానిని ఇంగ్లాండును పిలవక, యుద్ధంచేస్తున్న యితర దేశాలను, తటస్థ దేశాలను ఆహ్వానిస్తాడని అమెరికాలో ప్రకటించబడింది. యూరోపురాజ్యా లన్నింటి ఆర్థిక పునరుద్ధరణం, స్వాతంత్ర్య ప్రధానంకొరకు యీ సభ ఉద్దేశింపబడిందని చెప్పబడెను. ఈ వదంతి అసత్యమని బెర్లినులో ప్రకటించబడెను. ఇటువంటి ప్రకటనలు జర్మనీయొక్క బలహీనతను కష్టాలను చాటతాయేగాని, బలానికి నిదర్శనాలుగావు.

ఎందుచేతనంటే !

జర్మనీదేశంలోనున్న ప్రజలు చాల ఆశాభంగంచెంది నిరుత్సాహంగా ఉన్నారనడానికి ఎట్టి సందేహంలేదు. జర్మను సైనికులు యుద్ధరంగాలలో లక్షలుగా చస్తూ, ఎంతో త్యాగంచేస్తున్నారు. రష్యా దాడి చలికాలంలోగా ముగుస్తుందనుకుంటే ముగియలేదు. వివిధ యుద్ధరంగాలలో “హిట్లరు యువకులు” అనబడే యువసైన్యాలు నాశనమయి అంతకన్న వృద్ధులు సైన్యాలలో చేర్చుకొనబడుచున్నారు. రహస్యపు సైన్యాలు (ఎస్. ఎస్. దళములు) జర్మనీదేశం విడచి యుద్ధరంగాలకు పోవడంచేత దేశంలో నాజీపార్టీ బలం తగ్గిపోయింది. “యుద్ధం ఎపుడు గెలుస్తామా అనే ప్రశ్నకన్న, ఎట్లా గెలుస్తామా అన్న ప్రశ్న ఎక్కువ బాధిస్తున్నది. మనం గెలిచామంటే ముడిపదార్థాలు, శిరిసంపద అధికారం అన్ని గెలిచామన్నమాటే. కాని మనం ఓడితే అన్ని కోల్పోవడమేకాక, మన జాతిజీవితమే నాశనమవుతుంది. మనం చేసే త్యాగంకన్న, యిపుడు ఓడిపోయిన దేశాలు చేసిన త్యాగం చాల అధికంకాదా?” అని జర్మనీ ప్రచురణశాఖ మంత్రి డా॥ గబెల్సుగారు యిటీవల నుడివిరి. చివరకు విజయంపొందలేమేమో అనే అనుమానం అతనికి కలిగే యిట్లుపన్యసించాడు.

అందుచేత :

పోతున్న జర్మనులధైర్యం చిక్కబట్టుటకున్నూ, ముందుముందుగా తాను వివిధ యూరోపు రాజ్యాలకు చేయదలచిన మేలును ముందుగా ప్రకటించి, ఓడినా తిరుగుబాటులు చేస్తున్న ఆ దేశీయులను శాంతిపరచుటకున్నూ, హిట్లరు తన క్రొత్త విధానమును ప్రకటింపదలచెను. అందుకై యీ సభ యేర్పాటు చేసియుండును. అసలీ సభ రష్యా ముఖ్యపట్నమగు మాస్కో నగరం పట్టుకున్నాక ఆడంబరంగా ఆ నగరంలో చేదామనుకున్నాడేమో. కాని మాస్కో పట్టుబడలేదు. జర్మను ప్రజలుచేసిన త్యాగానికి తగిన ప్రతిఫలం పుట్టిందని తూర్పున పెద్ద రాజ్యమగు రష్యానుకూడ ఓడించామని ఆ సభలో చెప్పదలచియుండును. యూరోపు పూర్తిగ జర్మనీవశమయింది కనుక, యింక రష్యాకు సహాయంచేయడం దండుగని బ్రిటను-అమెరికాలకు నమ్మకం కలిగించుటకును, జపానుకు తన కోర్కెలు సిద్ధించేసమయం వచ్చిందని చెప్పుటకును, యీ యూరోపు రాజ్యాల ప్రతినిధుల సభను హిట్లరు తలపెట్టి యుండును. హిట్లరు క్రొత్తవిధానంలో, యూరోపు రాజ్యాలన్నింటికి పేరుకు స్వాతంత్ర్యంయిచ్చి, ముక్కుకి త్రాళ్లు కట్టి తన కీలుబొమ్మలలాగ త్రిప్పుకొన దలచెను. కాని యిట్టి చర్యను స్వాతంత్ర్యంకోరే ప్రజలెవ్వరును సహింపరు. హిట్లరు యీ నాటకం ఆడడానికి యింకా కొంతకాలం వేచియుండునని తోచును.

# భారతదేశ పరిశ్రమలు.

## యుద్ధంవలన కలిగిన ప్రోత్సాహం.

యుద్ధంవలన, భారతదేశంలో ఇపుడు క్రొత్తగాను విరివిగాను తయారగుచున్న ఆయుధ పరికరములగురించి, ఆహార పదార్థములు దుస్తులు మొదలగువానిని గురించి ఇదివరకు వివరించియుంటిమి. కాని నిజంగా యుద్ధమునకు కావలసిన వస్తువులకు, శాంతి పరిస్థితులలో ప్రజలకు కావలసిన వస్తువులకు యెక్కువ భేదంలేదు. సైన్యాలకు 60 వేల వస్తువులు కావలెనంటే వాటిలో ఒక్క ఆయుధ పరికరములు తప్ప మిగిలినవన్నీ, శాంతి పరిస్థితులలో గూడ నిత్యకృత్యములకు కావలసినవే. ఈ పట్టికలో, గుండుసూది మొదలు, మోటారుబండి, విమానము, నౌకలు మొదలగు నవన్నీ కూడ చేరును. వీనిలో చాలభాగం ఐరోపాదేశాలనుండి దిగుమతియగుచుండేవి. వానినన్నిటినీ ఇపుడీ దేశంలోనే తయారుచేయుటకు ప్రభుత్వంవారు ప్రోత్సహిస్తున్నారు.

ఉదాహరణకు వనస్పతి నూనెను తయారుచేసే ఫ్యాక్టరీల విషయం చూడండి. ఈజిప్టు మొదలగు ప్రాంతాలలో సైనికుల ఉపయోగంకోసం కావలసిన వనస్పతినూనెనంతను ఈ దేశంలోనే తయారు చేయించవలెనని బ్రిటిషు ప్రభుత్వం వారు కోరగా భారతప్రభుత్వంవారందుకు ఏర్పాటులుచేశారు. ప్రభుత్వంవారి ఆదరణ చూచుకొని క్రొత్త పద్ధతులలో మాత్రలను తయారు చేసే ఫ్యాక్టరీ ఒకటి బొంబాయిలో ఏర్పడింది. రోజుకు 2 లక్షల మాత్రలు అచట తయారగుచున్నయి. సైనికులు, వంటచేసుకొనే నిమిత్తం 10 వేల

# ఆస్ట్రేలియా టాంకులు.



గత యుద్ధంలో ఆస్ట్రేలియా గుఱ్ఱపు సైనికదళం చొరవతో ధైర్యంతో యుద్ధంచేసి మిత్రులు శత్రువులు ఉభయులచే ప్రశంసింపబడిరి. ఈ యుద్ధంలో పాల్గొంటున్న ఆస్ట్రేలియా సైనికులు అట్టి ధైర్యసాహసాలనే చూపుతున్నారు. కాని వారికిపుడు గుఱ్ఱాలకుబదులు ఫిరంగులతో అమర్చబడి ఎట్టి ప్రదేశంలోనైనా పోగల టాంకు మోటారులున్నవి. అవి పైన పటంలో చూడవచ్చును.

---

"కుక్కర్ల" ను తయారు చేయుటకు ఈ దేశంలో ఆర్డరిచ్చారు. ఇది మచ్చు చూడడానికి ఇచ్చిన ఆర్డరు బాగుంటే ఇంకా చాల వేల "కుక్కర్లను" కొనుటకు సిద్ధంగావున్నారు. ఇంతవరకు, చంచాలు, కత్తెరలు, చాకులు, దువ్వెనలు, గాగుల్సు, పాలను పరిశుభ్రంచేసే యంత్రాలు, చిన్న చిన్న డబ్బాలు, స్ప్రింగులు, అవిరి విరజిమ్మే యంత్రాలు, గుండుసూదులు, రబ్బరు బిరడాలు, ఈలలు, పింగాణీ వస్తువులు, సయింటిఫిక్ పరిశోధనలకొరకుపయోగించే "టెస్టుట్యూబులు" సులోచనాలు, "ల్యూబ్రికేటింగ్" నూనెలు మొదలగునవన్నీ ఇపుడీదేశంలోనే తయారగుచున్నాయి. కెమికలాయిలు, స్పిరిట్ మొదలగు వానితో వెలిగే "స్టవ్" లను గూడ తయారు చేయుటకు ఒక ఫ్యాక్టరీ నెలకొల్పబడింది. మొదటి దఫాగా, 4,000 స్టవ్‌లను తయారుచేసి ఇవ్వవలసినదని ప్రభుత్వంవారు ఆర్డరు ఇచ్చారు. దూరదర్శిని యంత్రాలను (బైనాక్యులర్సు) ప్రభుత్వంవారు తమ ఫ్యాక్టరీలలోనే తయారు చేయుచున్నారు.

## క్రొత్త ప్రయత్నాలు.

అయితే, అన్ని వస్తువులు ఈ దేశంలోనే తయారగునని చెప్పడానికి వీలులేదు. కొన్ని వస్తువులకు కావలసిన ముడిపదార్థాలు ఈ దేశంలో దొరకవు. అంతమాత్రాన ప్రభుత్వంవారు తమ ప్రయత్నంవదలక, ఆ ముడిపదార్థాలకు బదులుగా, ఉపయోగింపదగు—ఈ దేశంలో లభించు ముడిపదార్థాలను గురించి పరిశోధనలు జరిపిస్తున్నారు. విదేశీయ రంగులకు బదులు, ఈ దేశంలో లభించే పదార్థములనుండి రంగులు తయారుచేసే ప్రయత్నాలు చాలవరకు సఫలమైనాయి. కొన్నిరకముల గుడ్డలకు, "కాన్వాస్" కు ఒక విధమగు నార (ఫ్లాక్సు) ఇంతవరకుపయోగిస్తున్నారు. ఫ్లాక్సుకు బదులు, ప్రత్తిసూలును, జనుపనారను ఉపయోగించే మార్గాలు కనిపెట్టబడినవి. పెట్రోలు మొదలగు నూనెలకు బదులు, ఈ దేశంలో వేరుశనగ, నువ్వులు మొదలగు వానినుండి తయారుచేయబడే నూనెలను ఉపయోగించు విషయమై పరిశోధనలను జరిపించారు. మందుల విషయంలోను, హాస్పిటలు సామగ్రి విషయంలోను గూడ ఇట్టి మార్పులే జరుగుచున్నాయి.

## పనివారి తరిఫీదు.

ఈ పరిశ్రమల కన్నిటికీ, మంచి నిపుణులగు పనివారు కావాలి. తగినంతమంది, అనుభవజ్ఞులగు పనివారు లభించివుంటే, అభివృద్ధి ఇప్పటికంటె చాల అధికంగావుండేది. అందుచేత ప్రభుత్వంవారు యుద్ధం ప్రారంభం కావడంతోనే, వేలకొలది యువకులకు శిక్షణమొసగి, నిపుణులగు పనివారినిగా తయారు చేయుటకు దేశమునందన్ని ప్రాంతములలోను యేర్పాటులు చేశారు. యుద్ధం సామగ్రిని తయారుచేసే ఫ్యాక్టరీలలో యుద్ధారంభమగు సరికి 88 అప్రెంటిస్‌లు, 300 బాలురు తరిఫీదు పొందుతున్నారు. 1941 వ సం॥ ఏప్రిలు 1 వ తేదికి 132 మంది అప్రెంటిస్‌లు, 892 బాలురు శిక్షణము పొందుచున్నారు.

కాని దీనితో ప్రభుత్వంవారు సంతృప్తి పడలేదు. 1942 వ సం॥ సెప్టంబరు 1 వ తేది నాటికి ఈ ఫ్యాక్టరీలలో 10 మంది అసిస్టెంటు వర్క్సు మేనేజర్లను, 1,300 మంది సూపర్వైజర్లను, 6,000 మంది నిపుణులగు కార్మికులను తయారు చేయడానికి ఏర్పాటులు జరిగినవి. ఇందుకు రూ 25 లక్షలు వ్యయమగును. ఈ వ్యయమునంతా బ్రిటిషు ప్రభుత్వమువారే భరించుటకు వాగ్దానమొనర్చిరి.

ఇచటు తరిఫీదు నందినవారిలో కొందరిని ఆంగ్లదేశమునకు పంపి, అచటి పెద్ద యంత్రాలయములలో శిక్షణమొసగుటకు

యేర్పాటులు చేయబడెను. 1940 వ సంవత్సరములో కొంతమంది ఆవిధంగానంపబడిరి.

వీరు గాక, యితర యంత్రాలయాలలో గూడ లక్షల కొలది నిపుణులగు కార్మికులను తయారు చేయుటకు, ప్రభుత్వంవారు విరాళమునిచ్చి యేర్పాటులు చేయించిరి. ప్రస్తుతం వీనిలో 15,000 మంది కార్మికులు తయారుచేయుటకేర్పాటులున్నవి. 200 ఇంజనీయరింగు సంస్థలు, రైల్వే కర్మాగారములు, ప్రైవేటు ఫాక్టరీలు మొదలగువానిని గూడ ప్రభుత్వమువారీ పనికోసం ఉపయోగించుకుంటున్నారు.

### యుద్ధంతో నిలచిపోవు.

ప్రభుత్వంవారు, పరిశ్రమలను ప్రోత్సహించుటకు మరి రెండు సంవత్సరముల వరకును సరిపడు కార్యక్రమమును ఇదివరకే నిర్ణయించుకొని, దానిని త్వరితంగా అమలు జరుపుచున్నారు. ప్రస్తుతం, సైనికశాఖకు కావలసిన వస్తువులను సప్లయిచేసే ఫాక్టరీలకు మంచి విరాళాలను ఇస్తున్నారు. ఫాక్టరీలో తయారైన వస్తువులను కొనుటకు, పరిశోధనల జరుపుటకు విరాళములను వాగ్దానం చేయుటంవలన పరిశ్రమలు త్వరితంగా అభివృద్ధిపొందుటకు మంచి అవకాశము లేర్పడినవి. యుద్ధానంతరంగూడ, ఈ పరిశ్రమలకు రక్షణ మొసగెదరనీ, వదలివేయరనీ, భారతప్రభుత్వ వాణిజ్యసభ్యుడు వాగ్దానంచేశాడు. ప్రభుత్వంవారు, సరకును కొనుటకు గావించిన వాగ్దానాలను పురస్కరించుకొని, చాల పరిశ్రమలు తమ ఫాక్టరీలను విస్తరింపచేసుకొన్నాయి.

ఈ పరిశోధనల ఫలితంగా, ఇదివరకు ఈ దేశంలో లభింపవని అనుకొనిన అనేక పదార్థములు, లోహములు యీ దేశంలోనే సమృద్ధిగా లభింపగలవని తెలియవచ్చినది. వానిలో రాగి, అల్యూమినియ మొదలగునవి ముఖ్యమైనవి. ఈ ప్రయత్నముల ఫలితంగా, యుద్ధం ముగిసేసరికి, భారతదేశం తన సైన్యాలకు దేశరక్షణకు కావలసిన వస్తుసముదాయమే గాక, శాంతి రోజులలో ప్రజలకు గావలసిన పారిశ్రామిక వస్తువులను గూడ అత్యధిక భాగం యీ దేశంలోనే తయారుచేసుకో గల్గును.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### జర్మనీపై విమానదాడి.

శీతకాలం ముదిరి మంచు విస్తారం పడుచుండటం వలన, ఈ వారం జర్మనీమీద ఇదివర కంతటి తీవ్రమైన విమానదాడుల జరుపలేదు కాని ఫ్రెంచి తీరపు రేవులమీద ఫ్రాన్సు నందలి విమానాశ్రయాలమీద మాత్రం పెద్ద దాడులనే బ్రిటిషు విమానాలు సాగించినవి. హాలండు, ఫ్రాన్సు తీరములకు సమీపంగా ప్రయాణం చేయుచున్న శత్రు నౌకలను యెదిర్చి బాంబులువేసి వానిలో చాలభాగం ధ్వంసముచేసినవి. 24 వ తేదిన కొందరు బ్రిటిషు సైనికులు, చిన్నచిన్న నావలలో సముద్రందాటి అవలి తీరాన ఫ్రాన్సునందున్న నార్మండీ జిల్లాను ప్రవేశించి అచటనున్న శత్రుల ఆస్తులకు నష్టము గల్గించి, అందరూ సురక్షితంగా తిరిగివచ్చిరి. 22 వ తేదిన ఫ్రాన్సులో జరిగిన విమాన పోరాటంలో 6 జర్మను విమానములు పడగొట్టబడెను. బ్రిటిషు విమానాలలో ఒకటిమాత్రమే తిరిగి రాలేదు.

శత్రు విమానాలు, రాత్రివేళలలో ఒకటి, రెండుగా వచ్చి అక్కడక్కడ బాంబులు వేసిపోవుచున్నాయి. కాని వాని వలన ఆస్తులకుకాని ప్రాణాలకుగాని యెక్కువ నష్టం యెక్కడ కలుగలేదు. 24 వ తేదిన వీనిలో ఒక్క విమానం ధ్వంసము చేయబడెను. ఆ క్రిందటి రాత్రి ఇంగ్లాండుకు వచ్చిన రెండు శత్రు విమానములు పడగొట్టబడెను.

### టర్కీ, ఇరాకు, ఇరాను.

టర్కీవారి నౌకలు రెండు ఈ వారము, నల్లసముద్రమున, బల్గేరియా రేవులనుండి వెలుపలకువచ్చి, ప్రయాణ మొనర్చుచుండగా, ఒక జలాంతర్గామిచే ముంచివేయబడెను. మరియొక టర్కిషు నౌక మందుగనితగిలి మునిగిపోయెను. అందుచే, ఇకమీద టర్కీ నౌకలు నల్లసముద్రమున ప్రవేశింపరాదని టర్కీ అధికారులు తమ దేశపు నౌకలకు ఉత్తరువు గావించిరి.

టర్కీ అధ్యక్షుడగు ఇనూనూగారు, కొలది రోజులలో, జర్మనీ రాజధానియగు బర్లిను నగరమునకు జనునని అనుకొనుచున్నారు. టర్కీ ప్రభుత్వం అక్షరాజ్యములకు మిత్రమండలికిని సంధి కుదుర్చుటకు ప్రయత్నించునని ఇదివరకు తెలుపబడెను. ఆ విషయమై జర్మను నాయకులతో వివరముగ సంప్రదించుటకుగాను ఇనూనూగారు బర్లినుకు వెళ్లనున్నారని కొందరును, డిసెంబరు నెలాఖరున వియన్నాలో జర్మనీ జరుపనున్న యిరోపా రాజ్యాల మహాసభకు సంబంధించిన వివరములగురించి సంప్రదించుటకుగాను వెళ్లుచున్నాడని మరికొందరును తెలుపుచున్నారు.

### రష్యా యుద్ధము.

రష్యా యుద్ధము శీతకాలమున, తగ్గుటకుమారు మరింత తీవ్రమగుచున్నది. ఉభయపక్షములవారును చాలచోట్ల రాత్రిం బగళ్లుగూడ యెడతెరపిలేకుండ, భయంకరముగ పోరాడుచున్నారు. ఉత్తరమున మార్మనిస్కు రేవుపట్టణమును పట్టుకొనుటకు ఫిన్లండు-జర్మను సైన్యము లొనర్చిన దాడులన్నియును రష్యనులచే తిరుగగొట్టబడెను. దానికి దిగువనున్న లెనిన్‌గ్రాడు నగరపు ముట్టడి యింకను సాగుచున్నది. లెనిన్‌గ్రాడునుండి తూర్పుగా వెళ్లు రైల్వే జంక్షనగు టిక్విన్ నగరమును జర్మనులు గత వారము పట్టుకొనిరి. లెనిన్‌గ్రాడు నందున్న రష్యను సైన్యమున కొందరు బయటకువచ్చి, టిక్విన్ నగరముపై భయంకరముగు దాడి సాగించి అచటినుండి శత్రుల వెడలకొట్టి తిరిగి స్వాధీన పరచుకొనిరి.

మధ్యరంగమున జర్మనులు కొత్త సైన్యములను ఆయుధసామగ్రిని అపారముగ తెచ్చి దింపుచు, యెటులైనను రష్యను రాజధానియగు మాస్కో నగరమును పట్టుకొనుటకు బ్రహ్మాండమగు ప్రయత్నము లొనర్చుచున్నారు. ఉత్తరమునను పడమటను 35 మైళ్ల దూరమునకు వచ్చితిమని 26 వ తేదిన జర్మనులు ప్రకటించుకొనుచున్నారు. దక్షిణమున ఇంకను 75 మైళ్ల దూరమునందే యుండిరి. శత్రుల ఒత్తిడిచే తమ సైన్యములు కొంత వెనుకకు తగ్గవలసివచ్చెననియు, మాస్కో నగరపు స్థితి ఇంకను ప్రమాదకరముగనే యున్నదనియు రష్యనులుగూడ అంగీకరించుచున్నారు. శత్రుల వత్తిడిని ప్రతిఘటించుటకు రష్యనులుగూడ అనుక్షణమును కొత్త సైన్యముల దెచ్చి మాస్కో రంగమున దింపుచున్నారు.

దక్షిణమున డాన్ నదీ ముఖద్వారమువద్దనున్న రోస్టావు అనునగరమును ఆక్రమించితిమని జర్మనులు, ప్రకటించిరి. రోస్టావునందు పెద్ద ఆయుధనిర్మాణశాలలు గలవు. వర్తకమునకు అది కేంద్రస్థానము. ఇది శత్రువశమగుట రష్యనులకు పెద్ద నష్టమే. అయినను రష్యను సైన్యములు ఇంకొకవైపునుండి రోస్టావు నగరమునకు వెనుక (పడమర) ప్రాంతమున ప్రవేశించి, శత్రులనుడానెట్జు ప్రాంతమునుండి వెడలగొట్టుచున్నవి. ఇచట రష్యనులు శత్రులను రోజుకు 20 మైళ్లకుపైగా వెనుకకు తరుముచు, చాలమంది ఖయిదీలను

మందుగుండు సామగ్రిని పట్టుకొనుచున్నారు. ఇంకను దక్షిణమున క్రైమియాయందు సెబాస్టపూల్ రేవును పట్టుకొనుటకు జర్మనులు తీవ్రమగు దాడులు సాగించుచున్నారు.

ఇంతవరకు రష్యా యుద్ధమున జర్మను సైన్యములందు హతులైనవారు గాయపడ్డవారు ఖయిదీల సంఖ్య 60 లక్షలకు పైగానుండునని రష్యను అధికారులు ప్రకటించిరి. లెనిన్‌గ్రాడువద్దను దక్షిణమునను రష్యనులు సాగించుచున్న తిరుగుదాడులవలన, శత్రువ్యూహములు భిన్నమగుననియు, మాస్కోపై దాడి తీవ్రతను శత్రులు సడలించుకొనవలసియుండురనియు అనుకొనుచున్నారు.

### ఉత్తర, ఆఫ్రికా లిబియా, అబిసీనియా.

అబిసీనియాలో (తూర్పు ఆఫ్రికా) ఇటాలియనులు ఇంకా గోండార్ అనే ప్రాంతములో మాత్రం నిలచియున్నారు. గోండార్ దుర్గానికి పరిసరములలోవున్న వెంటిసింక్ మొదలగు చాల దుర్గములు బ్రిటిషు సైన్యములు ఆక్రమించెను. కొన్ని ప్రాంతములలో ఇటాలియను సైన్యములు వచ్చి లొంగిపోయినవి. ఆ ప్రాంతములలోనున్న చిన్నచిన్న సంస్థానాధీశులు వచ్చి బ్రిటిషు సైన్యములను చేరుచున్నారు. 25 వ తేదికి బ్రిటిషు సైన్యములు తుదకు గోండారు దుర్గమునకు 7 మైళ్ల సమీపమునకు చేరి, దానినే ముట్టడించుచున్నవి.

అబిసీనియాకు సంపూర్ణ స్వాతంత్ర్యమును అంగీకరించుచు, ఆ దేశపు చక్రవర్తియగు హెయిలీసిలాసితో బ్రిటిషుప్రభుత్వము ఒడంబడిక గావించుకొనుచున్నదని బ్రిటిషు ప్రభుత్వమంత్రి పార్లమెంటులో వెల్లడించెను.

లిబియా (ఉత్తర ఆఫ్రికా), ఈజిప్టు దేశముల సరిహద్దులయందు, చాల నెలలుగా బ్రిటిషు ప్రభుత్వము ఒక వైపునను, జర్మనీ-ఇటలీలు మరియొక వైపునను సైన్యములను ఆయుధ సామగ్రిని చేర్చుచున్నవి. బ్రిటిషు అధికారులు ఈ నెల 18 వ తేదిన ఆకస్మికముగ లిబియాపై దాడి ప్రారంభించిరి. 25 వ తేదివరకు జరిగిన పోరాటములో బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు దక్షిణ భాగమున 250 మైళ్లలోపలికి చొచ్చుకొనిపోయినవి. ఉత్తర రంగమున సిడిఓమార్, కోపుజో, జాడియా, అంగూ మొదలగు కోటలను పట్టుకొనినవి. ఈ సమయముననే టొబ్రూకు రేవు దుర్గమునందు ముట్టడింపబడియున్న బ్రిటిషుసామ్రాజ్య సైన్యములు బయటకువచ్చి శత్రుల పైబడినవి. ఈ విధముగ లిబియా తూర్పు భాగముయందున్న ఇటలీ-జర్మను సైన్యములన్నిటినీ, వానివద్దగల ఆయుధ సామగ్రితో సహా శిథిలము చేయుట బ్రిటిషు దాడి యొక్క యుద్దేశమని చర్చిల్ ప్రధాని ప్రకటించెను.

25 వ తేదివరకు 17 వేల శత్రు సైనికులు బ్రిటిషు వారికి ఖైదీలుగా చిక్కిరి. ఉభయ పక్షములందు "టాంకు" లు చాలవరకు శిథిలమైపోయెను. ఇటలీ - జర్మనీలకువున్న టాంకులలో సగమునకుపైగా నిర్మూలమైనవి. ఈ రంగమున బ్రిటిషువారు విమానములను విరివిగ ఉపయోగించుచున్నారు. శత్రులకు అన్ని విమానములు లేవు. అందుచే త్వరలోనే శత్రుల ప్రతిఘటన శిథిలముగావలసివుండును.

ఇటలీ - జర్మను సైన్యములకు, ఇటలీనుండి సముద్రము మీదుగ సైనిక సహాయముగాని, ఆయుధ సహాయముగాని అందకుండ జేయుటకుగాను, మధ్యధరాసముద్రమునందలి బ్రిటిషు యుద్ధనౌకలు, అనేకమగు అవరోధములను కల్పించుచున్నవి. 25 వ తేదిన రెండు సప్లైనౌకలు ముంచివేయబడెను. మరియొక యుద్ధనౌకకు గూడ అదేగతి పట్టెను.

ఇటాలియను విమానములు, బ్రిటిషు నౌకలను సమీపింపకుండ జేయజాలనందుకు, జర్మను అధికారులకు చాల అసంతృప్తి కలిగినది. అందుచే, ముసోలినీ వత్తిడి పైన-ఇటాలియను విమాన దళాధికారి తన పదవికి రాజీనామానీయవలసివచ్చెను.

### అమెరికాలో ఆయుధోత్పత్తి.

అమెరికాలో ఫ్యాక్టరీలయందు, గనులయందు వ్యాపిస్తున్న సమ్మెలు, అధికారులకు ఆందోళన కలిగించుచున్నవి. సమ్మెలు సంభవింపకుండ, కార్మిక వివాదముల పరిష్కరించుటకుగాను చట్టనిర్మాణ మొనర్చుటకు, రూజ్వెల్టు అధ్యక్షుడు, శాసనసభలలోని ప్రముఖులగు సభ్యులను పిలిచి సంప్రదించెను. కాని ఈలోగా, బొగ్గుగనుల పనివారికి యజమానులకు యేర్పడిన వివాదమును పరిష్కరించుకొనుటకు పంచాయతిని పనివారు అంగీకరించిరి. రూజ్వెల్టుగారు వెంటనే మధ్యవర్తులను నియమించిరి. కాని, మరికొన్ని ఫ్యాక్టరీలలో గూడ సమ్మెలు మరల ప్రారంభమైనవి. దీనివలన యుద్ధసామగ్రి యుత్పత్తికి భంగము గలుగునని అధికారులు భయపడుచు మధ్యవర్తి పరిష్కారమున కంగీకరింపవలెనని కార్మికులను యజమానులనుగూడ గోరుచున్నారు.

డచ్చి గయానా రాష్ట్రమునకు అమెరికను సైన్యములను పంపి తాత్కాలికముగ తమ ఆక్రమణయందుంచుటకు రూజ్వెల్టు అధ్యక్షుడు నిశ్చయించెను. అచటి బాక్సైటును శత్రుల స్వాధీనముగాకుండ కాపాడుకొనుట కిట్టి చర్య అవసరమని అమెరికా ప్రభుత్వాధికారులు భావించిరి.

రష్యాకు అమెరికానుండి రవాణాయగు ఆయుధ సామగ్రిని దింపుటకు రష్యాలోగల మర్మాన్స్కు ఆర్కెంజలు రేవులు శీతకాలంలో గడ్డకట్టిపోవును. ఆ మంచుగడ్డను నరికించి త్రోవచేసిననేగాని నౌకలు రేవులలో ప్రవేశింపలేవు. అందుచే, అమెరికా ప్రభుత్వంవారు సముద్రంలో మంచుగడ్డనుకోసి త్రోవచేసే నౌకలను నాల్గింటిని రష్యా ఉత్తర సముద్రములకు పంపుచున్నారు.

### జపాను, చీనా పసిఫికు ప్రాంతాలు.

తూర్పు, ఏషియా దేశాలలోనికి యుద్ధం వ్యాపించకుండా చేయడానికి, వాషింగ్టనులోని జపానురాయబారులు, రూజ్వెల్టు అధ్యక్షునితోను అతని కార్యదర్శులతోను జరుపుచున్న సంప్రదింపులు ఇంకను సాగుచునేవున్నాయి. ఈ వారం అమెరికా ప్రభుత్వ దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు బ్రిటిషు, ఆస్ట్రేలియా డచ్చి, ఇండియా దీవులు చీనా ప్రతినిధులనుగూడ పిలిచి, జపానుతో జరుగుచున్న సంభాషణల వివరములను దెలియచేశారు. పిదప మిత్రమండలి రాజ్యముల ప్రతినిధులు చాల సేపు సంప్రదించుకొని తమ అభిప్రాయాలను హల్లుగారికి తెలియజేశారు. హల్లుగారు ఒకవైపున మిత్రమండలి మంత్రులతోను మరియొక వైపున జపాను రాయబారులతోను సంభాషిస్తున్నారు. జపానులో గూడ విదేశాంగ మంత్రి, అమెరికా సంప్రదింపుల వివరముల గురించి తమ ప్రభుత్వ శాఖాధికారులతో ఆతురతతో సంప్రదిస్తున్నాడు.

ఏమైనా, చైనాను వదలివేయుటకు అమెరికా అంగీకరించదనీ, అందుచే ఈ సంప్రదింపులువలన ఫలితంవుండదనీ, జపానులోను, అమెరికాలోనూ గూడా అనుకుంటున్నారు. జపాను శాసన సభను ఈ నెల 21 వ తేదిన ముగించుచు జపాను భవిష్యత్తు ఇపుడు జపానీయులు కనుపరచే కృతనిశ్చయంమీద ఆధారపడివుండుననియు, అందుకు జపాను సర్వ సంసిద్ధముగ వుండవలెననియు జపాను ప్రధాని టోజోగారు హెచ్చరించారు. దేశంలో విమానదాడుల రక్షణకు ఏర్పాటులు మొదలగు వానిని త్వరితంగా పూర్తి చేస్తున్నారు.

బ్రిటిషు మంత్రియగు డఫ్‌కూపరుగారు బర్మానుండి చైనాకు మందుగుండు సామగ్రి రవాణాయగుచున్న మార్గము

ఇక యెన్నడును మూసివేయబడదని హెచ్చరించెను. చైనీయులు, ప్రస్తుతము బర్మా రోడ్డుతో పాటు, ఇండియానుండి హిమాలయ పర్వతాలగుండా మరియొక మార్గమును వేసుకుంటున్నారు.

ఇండో-చైనాలో, తాయి (సయాం) దేశపు సరిహద్దులలో జపాను అధికారులు లక్షల సైన్యమును, చైనా సరిహద్దులలో 20 వేల సైన్యమును కేంద్రీకరించిరని చైనా నుండి తెలియుచున్నది. ఇండో—చైనానుండి కొన్ని విమానాలు తాయి దేశంలోని రైల్వేలపై వేగుచూచి వెళ్లెను. మరికొందరు ఇండో-చీనా సైనికులు సరిహద్దు దాటి, వచ్చి ఒక వూరును దోచుకొని పోయిరనిగూడ తెలియుచున్నది. ఈ చర్యలను చూచి, తాయి ప్రభుత్వము అనుమానపడి తమ దేశంలోని ప్రజలను వెంటనే సైన్యములో చేరవలెనని హెచ్చరించెను.

తూర్పు దేశాలలో శాంతి ఆశలు చాల సన్నగిల్లెననియు, తాయిదేశం, ఏక్షణమునన్నైన తన ఆత్మ రక్షణకోసం యుద్ధంలో దిగవలసి వచ్చుననియు, అపుడు మిత్ర దేశాల సహాయమును గూడ అంగీకరించుననియు 25 వ తేదీన తాయి రేడియో ప్రకటించినది. జపాను ప్రధాని టోజోగారు 25 వ తేదీన ప్రసంగిస్తు, జపానును ప్రస్తుతం, బ్రహ్మాండమగు విషమ పరిస్థితులు నెదుర్కొనియున్నవనియు, వానిని దాటి బయటపడుటకు జపాను జాతీయులు, సమస్తత్యాగములను చేయుటకు సిద్ధముగ నుండవలెననియు, హెచ్చరించిరి.

## ఫ్రాన్సుకు జర్మను వత్తిడి.

విషీయందలి ఫ్రెంచి ప్రభుత్వంలో విభేదాలు అధికమౌతున్నాయి. ఫ్రాన్సు యుద్ధం మానినప్పటినుండీ, ఉత్తర ఆఫ్రికాలో ఫ్రెంచివారి పాలనలోవున్న దేశాలకన్నిటికి ప్రధాన పరిపాలన కర్తగవుంటున్న వేగాన్ సేనానిని విషీ ప్రభుత్వం ఫ్రాన్సుకు పిలపించింది. అచట అధికారులతో దీర్ఘంగా సంప్రదింపులు జరిగిన తరువాత వేగాన్ సేనాని తన పదవికి రాజీనామా పెట్టి, ఫ్రాన్సులో దక్షిణ ప్రాంతాలకు వెళ్లిపోయాడు. పిమ్మట జూయిన్ సేనానిని, ఆఫ్రికాలోని ఫ్రెంచి సైన్యాలకు ప్రధాన సేనాధికారిగా నియమించారు.

వేగాన్ సేనాని అంటే ఫ్రెంచి ప్రజలకు చాలా అభిమానం అమెరికావంటి తటస్థ దేశాలకు కూడ అతడంటే కొంత నమ్మకం. అందుచేతనే విషీ ప్రభుత్వం జర్మనీకి యెంత అనుకూలంగావుంటున్నా ఫ్రెంచి ప్రజలకు అమెరికా ఆహారపదార్థలను పంపుచున్నది. ఇపుడు వేగాన్ సేనాని పనిలోనుండి తొలగించడంవలన, ఫ్రెంచి ప్రభుత్వం ఇకమీద అక్షరాజ్యాలతో సంపూర్ణంగా చేరపోతున్నదనీ, వేగాన్ సేనాని అందుకు అంగీకరించకపోవడం చేత, పనినుండి తొలగించారనీ అనుకుంటున్నారు. అమెరికా ప్రభుత్వం ఇకమీద ఫ్రెంచి ప్రభుత్వంతో అనుకూలభావంతో వుండలేదనీ ఫ్రాన్సుతో రాజకీయ సంబంధాలు త్రెంచివేసుకొని, ఆఫ్రికాయందలి ఫ్రెంచివారి రేవులు శత్రు హస్తగతం కాకుండా వుండడానికి అవసరమగు చర్య దీసుకుంటుందని అమెరికా అధికారులు హెచ్చరించారు. జర్మనీ-ఇటలీలతో ఫ్రాన్సు చేయవలసిన సహకారమును గురించి సంప్రదించడానికిగాను ఫ్రెంచి ప్రభుత్వాధిపతియగు పెటెయిన్ సేనానిని, ఫ్రాన్సులో జర్మను ఆక్రమణ క్రిందనున్న ఒక రహస్య ప్రదేశానికి రమ్మని హిట్లరు కబురంపించాడు. ఇటలీ తరఫున ముసోలినీ కూడా ఆ సమావేశానికి వస్తాడు. ఆ సమావేశంలో ఫ్రాన్సు, రష్యాలో యుద్ధానికి 3 లక్షల సైన్యాలను పంపవలెనని అడుగుననీ, ఉత్తర ఆఫ్రికాలోని ఫ్రెంచి ప్రాంతాలకు జర్మను సైన్యాన్ని పంపుటకు అనుమతింపవలెననీ హిట్లరు పెటెయిన్ సేనానిని కోరునని అనుకుంటున్నారు.

## ఆక్రమిత దేశాలలో జర్మను దురంతాలు.

ఐరోపాలో జర్మను ఆక్రమణయందున్న దేశాలలో జర్మను సైనికుల రాక్షసకృత్యములు అధికమౌతున్నాయి. జర్మను సైనికులు, తమచే ఖైదీలుగా పట్టుకొనబడిన శత్రు సైనికులను వినోదార్థంకూడా చంపుతున్నారని వార్తలు వచ్చుచున్నవి. ఈ మధ్య జర్మను ఆక్రమణలోవున్న దేశాలలోని స్థితిని కనుగొనుటకు వెళ్లిన అంతర్జాతీయ ఇన్ఫర్మేషన్ సంఘంవారు, ఈ దౌర్జన్యాలను గురించి వివరిస్తూ, ఫ్రాన్సులో గత రెండువారములలోను 250 మంది ఫ్రెంచివారు చంపబడ్డారని వెల్లడించిరి. పోలండులో ఇంతవరకు 80 వేల మంది ప్రజలను తిరుగుబాటు నేరాలకుగాను చంపివేశారు. జెకోస్లావాకియాలో గత రెండు నెలలలోను, 352 మంది చంపబడిరి. గ్రీసులో ఆక్రమణ పూర్తియైన తరువాత 15,000 మంది హత్యచేయబడిరి. తమ సైనికులలో 19 మందిని యెవరో హత్య చేశారనే కారణంచేత గ్రీసులో బల్గేరియా సైన్యాలు ఆరు గ్రామాలను నిర్మూలం చేశాయి. క్రోషియాలో 2 లక్షల మంది ప్రజలు ఇంతవరకు తిరుగబాటుల నణచుటలో చంపబడిరి. బెల్జియంలో అనుమానస్థులగు వారిని జర్మను సైనికులు బలవంతంగా పట్టుకు లాక్కుపోతుంటారు. ఇక వారిని గురించి ఎవరికీ ఏమి తెలియదు. జెకోస్లావాకియాలో 20 తేదీన, "విద్రోహ" చర్యలకుగాను 5 మంది వురిదీయబడిరి.

ఒక వైపున ఇంత దురంతాలను జరుపుచు, హిట్లరు ముసోలినీలు, ఆక్రమిత దేశాల ప్రభుత్వ ప్రతినిధులను, తమపై అభిమానంగల మరి కొన్ని ఐరోపా ప్రభుత్వాల ప్రతినిధులను మొత్తం 13 దేశాలు వారిని ఈ వారం జర్మనీలో సమావేశపరచి, రష్యా మీద యుద్ధం సాగించడానికిగాను మిత్రమండలిగా తయారు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ సభకుగాను ఇటలీ విదేశాంగ మంత్రియగు కియానోగారు 24 తేదీన, జర్మను రాజధానియగు బర్లినునగరంచేరెను. హిట్లరు, ఓడిపోయిన రాష్ట్రాలతో యెటువంటి ఒడంబడికలు చేసుకున్నను అది నామమాత్రమేగాని, ఆ దేశాల ప్రజలనుండి ఏవిధమైన సహకారమునురాదు.

## ఐరిషు నౌకపై దురంతం.

ఐర్లండు ప్రభుత్వంతటస్థంగావున్నా అపాయం తొలగలేదు. ఐరిషు నౌక యొకటి బ్రిటను తీరమునకు 10 మైళ్ల దూరంగా సముద్రంలో ప్రయాణం చేస్తుంటే జర్మను విమానం ఒకటి బాంబులు వేసి ముంచివేసినదని ఐర్లండు ప్రభుత్వ ప్రధానియగు డివెలిరాగారు, ఐరిషు శాసన సభలో ప్రకటించారు. అయినా, ఐర్లండు దేశీయుల వర్తక నౌకలకు ఆత్మరక్షణకుగాను ఆయుధముల నమర్పవలెనని ఉత్తరువు చేయనని డివెలిరా ప్రకటించాడు.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.